తిరుపతి వేంకటేశ్వరకవులు

శ్రీమదెడ్వర్డుపట్టాభిషేకనాటకము

కాకినాడ, 1904

Record no. 378

Tirupati Vēṅkaṭēśvarakavulu

Śrīmadedvarḍupaṭṭābhiṣēkanāṭakamu

Kākināḍa, 1904

Record no. 378

## Bibliographic Record Target

తిరుపతి వేంకటేశ్వరకవులు.
శ్రీమదెడ్వర్డుపట్టాభిషేకనాటకము / ఇది తిరుపతి వేంకటేశ్వరకవులచే రచియింపఁబడినది.- 1. కూర్పు.- కాకినాడ : శ్రీబాలసరస్వతీ ముద్రాక్షరశాల, 1904.
4, 2, 53 p. :ports. ;20 cm.
Record no. 378

Tirupati Vēṅkaṭēśvarakavulu.
Śrīmadeḍvarḍupaṭṭābhiṣēkanāṭakamu / idi Tirupati Vēṅkaṭēśvarakavulacē raciyimpam̐baḍinadi.- 1. kūrpu.- Kākināḍa : Śrībālasarasvatī Mudrākṣaraśāla, 1904.
4, 2, 53 p. :ports. ;20 cm.
Record no. 378

సరస్వత్యనుబంధము. ౩౫

శ్రీరస్తు.

# శ్రీమదెడ్వర్డుపట్టాభిషేకనాటకము.

ఇది

శతావధానులును శ్రీపోలవరం సంస్థానస్థితులును

నగు

తిరుపతి వేంకటేశ్వరకవులచే రచియింపఁబడినది.

సరస్వతీపత్రికనుండి పునర్ముద్రితము.

మొదటికూర్పు

కాకినాడ,

శ్రీబాలసరస్వతీముద్రాక్షరశాల.

1904

వెల. 6 అణాలు.



HER MAJESTY QUEEN ALEXANDRA.

# FORE WORD.

The following drama was written under my suggestions by the twin poets and sathavadhanis-Pandit Thirupatysastry and Pandit Venkatasastry-in adaptation of the drama of the well known poet Pandit Vidyanatha in Sanskrit, illustrating the art and science of Dramaturgy. Some-time back, during the year before last, in the course of conversation, the poets told me that they intended translating the Sanskrit version of Vidyanatha into Telugu, from the well known book on rhetoric, commonly understood by the name of Prataparudreeyamu, as a supplement to Narasabhupaleeyamu of Bhattumurty. But as the year before last was marked by the coronation of our beloved Emperor, King Ebward VII, I suggested to them, that instead of merely translating the drama of Vidyanatha from Prataparudreeyamu, for rendering its translation complete, they might suiting the occasion, write a drama, on similar lines illustrating the great Historic incident of the coronation of the King Emperor. Thus the following drama was written by those poets and a due amount of care was taken in seeing that the incidents mentioned therein were, as far as possible, historically and chronologically consistent and correct.

Books on the art and science of Dramaturgy, had never been composed by the old Telugu poets, nor any attempts towards the popularising of the art and science of writing dramas seemed to have been made by them, although the Drama had been developed to a very high degree in Sanskrit and the art and science of Dramaturgy completely settled and elaborately explained. Though the rhetoric of Sanskrit had been almost completely copied and adapt-

ed to the Telugu Literature, no attempts were ever made to copy the art and science of Dramaturgy into Telugu, on account of the total absence of Dramas in Telugu and the utter prejudice the old Telugu poets seemed to have always entertained against the translation of the Sanskrit Dramas into Telugu. They appear to have been also unwilling to undertake the task, on account of the decline of the stage and also the mistaken notion and supposition that the Telugu language was totally unfit for the purpose of the Drama. The great masterpieces of Kalidasa, Bhavabhuti and other Sanskrit dramatists, were no doubt the main sources from which, the old Telugu poets have borrowed the idea of writing the well known Prabandhams in the Telugu literature. But as the spirit of the Drama completely waned away, and the purpose for which the great Sanskrit dramas were composed, was totally forgotten and even came to be misunderstood during the times when the great masterpieces in the Telugu literature were written, the old Telugu poets never concerned themselves with either the translation of the Sanskrit Dramas into Telugu or any original ones in that language. With the decline of the stage, Sanskrit dramas ceased to be represented in theatres and came to be understood as being written not for the purpose of being enacted on the stage but for being read and enjoyed by the Sanskrit students and scholars alike. As the stage declined and was being looked down and regarded as being totally disreputable and even base, there was infact no need felt for any kind of Dramas in the popular languages. The street dancers and the opera singers became multiplied in numbers and were freely patronized by the popular rustic world and were looked down upon by the more civilized people and the



literary men with contempt and scorn. This new unhealthy tendency has also contributed to the prejudice which the old Telugu poets had for the composition of Dramas in the Telugu language. Even when the old Telugu poets, were influenced by their love of Literature, to adapt sanskrit dramas into Telugu, they did not attempt to translate any such into that language but merely contented themselves in narrating the whole Story and the plot of such dramas in ordinay Telugu poetry in the form of Prabandhams. A few operas, were no doubt written in Telugu by the renowned Siddheendrayogi and others but they never came to be recognised as literary compositions. These seem to be the causes in particular, for the peculiar phenominon of the total absence of books on the art and Science of the drama in Telugu literature. Even when translating Prataparudreeyamu into Telugu, the poet Bhattu Murti, did not care to translate portions of the book treating about the Drama but left them out as being unnecessary for the Telugu Literature.

But as times are now changed and the Stage is slowly gaining its due respect and popular sympathy, a large demand for Dramatic compositions in the Vernacular languages has been created, the Telugu writers of the present age have been busy in translating the old sanskrit pieces and also writing some original Dramas in Telugu. Thus the present age of Telugu literature may justly be termed as the age of the Drama. This new tendency and the influx of a large number of Dramas into Telugu literature has naturally created the desire of writing books on the art and science of Dramaturgy. As almost all the Telugu Dramas now current, are based on sanskrit models and are almost copied and made consistent with the established

rules of sanskrit Dramaturgy and Rhetoric, the art and science of Dramaturgy in the sanskrit literature has been, adapted to the exigencies of the Telugu literature and attempts for elucidating the sanskrit Dramaturgy in the Telugu language are being made. Several books on the subject have been already published in Telugu, but as none of them attempts at the illustration of the rules of Dramaturgy except merely explaining and presenting to its readers, the bare skeleton of the science and its dry rules, an attempt has been made for the first time in this Drama to explain the established rules of sanskrit Dramaturgy in an illustrative Drama clothed in flesh and blood. This Drama may not come up to the literary standard of Vidyanatha's Drama in Prataparudreeyamu and may be found defective and far inferior to it in several respects. But as a first attempt in the right direction, prompted by feelings of genuine love for the Telugu literature and stimulated, of course by a deep sense of loyalty and affection to the British throne, I hope this Drama will not be unacceptable to the Telugu readers.

15th March 1904 } K. R. V. KRISHN RAU, B. A.

Cocanada. } *Zamindar of Polavaram.*



## పీఠిక.

మేమొకనాఁడు ప్రతాపరుద్రీయమును జదువుచుండఁగా నందలినాటకలక్షణమునకు లక్ష్యముగా విద్యానాథమహాకవి రచించిన ప్రతాపరుద్రపట్టాభిషేకమను నైదంకముల నాటకముంజూచి మూర్తికవి దానియందలి యుత్తరభాగము లన్నిటిననుసరించి నరసభూపాలీయము రచించినపగిది నేదానిం దెలిఁగింపఁ దలంపుగలిగి మహారాజశ్రీ మారామచంద్రవేంకటకృష్ణరావు బహదరుగారితో విన్నవింప వారాలోచించి సరస్వతీపత్రికలోఁ బ్రచురించుటకై నాటకలక్షణమునకు లక్ష్యముగానే యీనాటకము ననుసరించి యెడ్వర్డుపట్టాభిషేకనాటకమును రచించిన బాగుండునని సెలవిచ్చిరి. మేము వారియాలోచనకు రాజభక్తికి నపరిమితానందమునొంది యీనాటకమునం గల ప్రక్రమము ననుసరించియే సలక్షణముగ మనచక్రవర్తిగారి పట్టాభిషేకకథ నైదంకముల నాటకముగ రచించితిమి. నాటకోపయోగమునకై ప్రస్తుతకథను విరుద్ధము గాకుండఁ గొన్నిచోట్లఁ గొంచెము మార్పవలసివచ్చినది. పూర్వమహారాజులకథలు ప్రబంధములుగాఁ గాని నాటకములుగాఁ గాని రచించినప్పుడు కవులిట్టిస్వాతంత్ర్యమును వహించియే యున్నారు కావున నధునాతన చక్రవర్తి చరిత్రమును జదివియుఁ జూచినట్టి యెఱింగిన హూణభాషాధిప లందఱును మన్నింతురని తలఁచెదము.

ఇందలి ప్రథమాంకములో విక్టోరియా మహారాజ్ఞిగారి స్వప్నము మూలకథలో లేనిది. మూఁడవయంకములోఁ జక్రవర్తిగారు యువరాజుగా నున్నపుడు మనదేశమును గాంచినకథ వ్రాయఁబడినది. అదిచూచి వారాప్రదేశములే చూచిరనియు నాక్రమ్ముగనే దేశయాత్ర గావించిరనియుం దలంపవలదు. మొత్తముమీఁదఁ గొన్నిదేశములు చూచిన విషయము సత్యము గావున నాటకోపయోగముగ మార్చుకొంటిమి. కిరీటధారణోత్సవము మొదలగునవి వర్ణించిన యంకములయందుఁ బ్రధానకథకు భంగము లేకుండఁ జేసిన కొంచెపుమార్పు లుండిన నుండవచ్చును. కథాపాత్రములకుఁ దెలుఁగునాటకము ననుసరించి ప్రధానులకుఁ దప్పఁదక్కినవారికిఁ దెలుఁగుపేరులే వాడితిమి. నాటకమునందుఁ జెప్పవలసిన పంచసంధులయు వానియంగములయు లక్ష్యములకు గుర్తులు చూపి లక్షణములు దిగువవివరించితిమి. దీనియందుఁ బ్రామాదికాదిదోషము లుండినచోఁ బండితులు మన్నింతురని కోరుచు నీక్రింద సంక్షేపముగా నాటకలక్షణము వివరించుచున్నారము.

నాటక మనఁగా ముఖప్రతిముఖగర్భవిమర్శనిర్వహణము లనుసాంగములగు నైదుసంధులతో నుత్తమనాయకుని చరిత్రము శృంగారవీరరసముల యందొకటి ప్రధానముగా దృశ్యముగాఁ జేయునది. అందాశీర్నమస్క్రియావస్తునిర్దేశాన్యతమరూపమగు మొదటిపద్యము నాంది యనంబడు. ఇదిపూర్వరంగమునకు ముఖ్యాంగము. దానియం దర్థముచేతఁగాని శబ్దముచేఁ గాని కథను సూచింపవలెను 8 గాని 12 గాని 18 గాని 22 గాని పదములుండవలయును. సూత్రధారునకు నటీమారిషవిదూషకులందొకనితో జరపుసంభాషణమాముఖ మనఁబడును. ఇదియేప్రస్తావన. నాందిచేసిన పిదప శరద్వసంతములలో నొకఋతువును భారతీవృత్తిగల పద్యముతో వర్ణించి కావ్యకథ సూచింపవలయును. కథోద్ఘాతము, ప్రవర్తకము, ప్రయోగాతిశయమని ప్రస్తావనకు మూఁడంగములు. ఉద్ఘాత్యాదులు మఱియుఁ బదుమూఁడు కలవుగాని వానిని యథావకాశముగాఁ బ్రయోగించుకొనవచ్చును. విష్కంభ చూళికాంకాస్య ప్రవేశకాంకావతారములను నైదింటిచే నాటకమునఁ జూపఁదగనికథను సూచించుచు నంకావాంతరకథలను గలుపుచుండవలయును. ముఖసంధికి 12 ను బ్రతిముఖసంధికి 13 ను గర్భసంధికి 12 ను విమర్శసంధికి 13 ను నిర్వహణసంధికి 14 ను నంగములుగలవు ఈయఱువదినాల్గంగములు గల పంచసంధులను జూపి వెనుకఁ జెప్పిన విష్కంభాదులైదింటిచేఁ గథను గలుపుకొనుచు రచింపఁబడినది సలక్షణమగునాటకము. ఈయంగములస్వరూపము లన్నియు మేమచ్చటచ్చట దిగువ నుదహరించియే యుంటిమి గావున నిందు వివరింపలేదు. గుర్తులుంచుటలోఁ బ్రమాదమునఁ గొన్నియంగములసూచన విడిచినను వానిఁ దజ్ఞులు కథాభాగమున సమన్వయింపఁజేసికొందు రని వేఁడుచున్నారము.

ఇట్లు,

శతావధానులు, తిరుపతి వేంకటేశ్వరులు

శ్రీపోలవరసంస్థానాధిపతులగు శ్రీకొచ్చెర్లకోట రామచంద్రవేంకటకృష్ణ

రావుబహదరుగారి యాస్థానవిద్వాంసులు.



శ్రీ ర స్తు.

# ఎడ్వర్డుపట్టాభిషేకనాటకము.

## ప్రథమాంకము.

§ శా. శ్రీశుండుం దుహినాద్రిజాపతియు వాణీశుండు దేవేంద్రము
ఖ్యాశాపాలకసంఘ మానతి యవశ్యం బొదలం దాల్ప నా
నాశాస్త్రజ్ఞలసత్సభానుమతి విన్నాణంబుగా దీవులెం
తేశాసించిన దేవి యెల్లపుడు మీ కిచ్చుఁగా దృఢైశ్వర్యమున్.

ఉ. వాయుసుతుండు ముం దెడమవైపున జానకి వెన్కలక్ష్మణుం
డాయన తమ్ముఁడుంగా భరతుఁ డావల నీవల సూర్యపుత్రుడై
తేఁ యథవాదులెల్ల నలుదిక్కుల మూలలఁ గొల్వఁ బట్టభ
ద్రాయితమైన యుత్పలదళాకృతి మిమ్మనయమ్ముఁ బ్రోవుతన్.

సూత్రధారుఁడు—(నాంద్యంతమున నలుదెసలు పరికించి సంతోషముతో) అప్పుడేరంగస్థలమంతయుఁ జక్కఁగా నలంకరించినారే!

† గీ. నలుదెసల నిండుచుండె మద్దెలల వలన, వెడలునాదంబు బుధకర్ణపేయమగుచుఁ
దేఁయలు జాలువాఱఁగ దీటుకొనియెఁ, గిన్నరలనుండి సంగీతకీర్తనములు.

(మిన్నువంకఁ జూచి) చిరకాలమునను దుర్దినములు గడచి దిశాముఖంబులు తెలివినొందినవి.

‡ గీ. రాజహంసలక్ష్మి రమణవహింపఁగ, మిత్రమండలంబు మేల్మిఁ జెంద
సర్వదిశలయందు సన్మార్గమును జూపు, చతిశయించె శారదాగమంబు.

---

§ ఇది పదు నెనిమిది పదములు గలనాంది. ఇందు మణిద్వీపాధివాసినియై స్త్రీసభచేతను బ్రహ్మవిష్ణుమహేశ్వరుల చేతను సేవింపఁబడుచున్న పరశక్తిని వర్ణించుటచే ధర్మాచరణసంఘము (the three estates.) చేతను గొర్నరులచేతను సేవింపఁ బడుచున్న విక్టోరియా సూచింపఁబడుచున్నది.

ఇది యిరువది రెండు పదములుగలనాంది. ఇందు సపరివారుఁడగు రామభద్రుని పట్టాభిషేకము వర్ణించుటచే నెడ్వర్డుభూపాలుని పట్టాభిషేకము సూచింపఁబడుచున్నది

† ఇది రంగప్రసాధన మను ప్రస్తావనాంగము.

‡ ఇందు ఋతుసమాశ్రయముచే భారతీవృత్తి చెప్పఁబడినది.

(వినయముతో సభవంకకుఁ దిరిగి దోసిలి యొగ్గి) సప్తమైశ్వర్య భూపాలపట్టాభిషేక మహోత్సవ మభినందించుటకుం గూడిన యోసభాసదులార! నేను నాట్యవేదక శాస్త్రవుని కుమారుఁడను నాపేరభినవభరతాచార్యుఁడు. నాకు నేఁడేదేని నొకనాటక మాడుటకు సెలవిండు (ఆకాశమువంకకుఁ జెవియొగ్గి) ప్రస్తుత మహోత్సవమునకుం దగినదియు నూతనప్రసిద్ధకవివిరచితంబును నగు తెనుఁగు నాటక మొకటి యభినయింపుమనుచున్నారా! (సంతోషముతో) ఏమీ! నాభాగ్యము. నా మనోరథమునకుం దగినరీతినే సభవారానతిచ్చిరి. సెలదినముల క్రింపటనే—

గీ. అరసితిరుపతివేంకటేశ్వరు లిరువురు, చేసి రైశ్వర్యపట్టాభిషేక మనెడు
నాటకం బొండు కొచ్చెర్లకోట రామ, చంద్రవేంకటకృష్ణరాయేంద్రు నాజ్ఞ.

దాని నభినయించి యీసభాసదుల యుల్లంబులు పల్లవింపఁ జేసెద. ఆహా! దైవఘటనయన నిట్లుండవలయు:—

§ చ. నవరసబంధబంధురము నాటక మీసభవారు విప్పలం
బ్రవరులు మెప్పెఱుంగుదురు మాపరివారము నృత్యనాట్యబం
ధురమని పెక్కుచోటుల బుధు ల్గొనియాడఁ జెలంగె సప్తమై
శ్వరుఁడు చక్రవర్తియగుట ల్కథ యిందిక వేయునేటికిన్.

(ఆలోచించి) ఏలాకో మానటి యింతతడవు చేసినది?

నటి—(ప్రవేశించి) ఆర్యపుత్రా! ఇదిగో వచ్చితిని. నేఁ జేయవలసినపనికై నన్ను నియోగింపుఁడు.

సూత్ర—నీవు చేయవలసినపని యింకేమి యున్నది.

ఉ. పాడెదఁ గోకిలస్వరముపద్ధతి నాడెద వీసమేనియుం
బాడిదొలంగకుండఁ ననుభావము చూపెదనంచు నింటఁ బూ
బోఁడిరో కూర్చునెచ్చెలులపొంతఁ బ్రగల్భము లాడుదాన వీ
నాఁడు సభాముఖంబునఁ గనంబడఁ జేయుము నీప్రతాపమున్.

నటి—(భయముతో) నాట్యసామగ్రి సమకూర్చుటకై యింతతడవైనది. సర్వము సన్నద్ధపఱచితిని, యిపుడు ప్రయోగింపవలసిన నాటక మేదియో సెలవిండు?

సూత్ర—ఈనాటక మాడవలయు. (అనిపత్రికచేతి కందిచ్చును)

§ ఇది ప్రశంసచే సభాభిముఖీకరణరూపమగు ప్రరోచన యనునంగము.

* ప్రియసన్నుతములగు వాక్యములచే నిందాస్తుతి చేయుటవలన ఫలమనునంగము.



నటి—(పుచ్చుకొని) ‡ గీ. అతివ యొక్కర్తు దేశంబు లాక్రమించి
చక్రవర్తిని యనుపేరునైతమంది
పుడమియేలిన తర్వాతఁ గొడుకు పట్ట
భద్రుఁడగునట్టి కథ చూడవలయు నేఁడు.

(అని చదివి) ఆర్యపుత్రా! ఈకథ యెద్దియో నాకుఁ దెలియకున్నది. వివరించి చెప్పుఁడు

సూత్ర—ఓసీ మూర్ఖురాలా! ఇంతమాత్రము తెలిసికొనలేకపోయితివి. విక్టోరియా చక్రవర్తి కుమారుఁడగు సప్తమైశ్వర్యభూపాలుని పట్టాభిషేకకథయని కాదా దాని యర్థము.

నటి—ఆర్యపుత్రా! తెలియక యడుగుచున్నాను క్షమింపుము. ఐశ్వర్యపదమునకు వెనుక సప్తమపదము గూడ నెందులకో?

సూత్ర—దానికిఁ జాల నర్థము కలదు.

గీ. ఆర్థు రైశ్వర్య లనురాజు లన్వయమున, వసుధఁ బాలించి రేడవవాఁ డితండు
గాన సప్తమపదమును గాంచెఁ గలికి, చారుతరకీర్తి యిండియాచక్రవర్తి.

నటి—ఆసప్తమపదమున కా యర్థముకంటె నీయర్థము చెప్పిన బాగుండునేమో.

గీ. చక్రవర్తులు మును హరిశ్చంద్రముఖ్యు, లార్వురేగిరి రాజు లీయవనియందు
సప్తముఁడు గాన నైశ్వర్యచక్రవర్తి, సప్తమైశ్వర్యుఁ డనుమాట సార్థకంబు.

సూత్ర—ప్రియురాలా! సాధు సాధు! ఇట్టి యర్థమును* జెప్పిన నీబుద్ధిచాకచక్యము వేయినోళ్ళఁ బొగడఁ దగినది.

† నటి—ఇది యంతయుఁ దమయనుగ్రహమే.

సూత్ర—ఔను నాయనుగ్రహమనుట న్యాయమేగాని

గీ తరుణి నీవంటి సత్కళత్రంబు వలన
మిగులఁ బొగడొందెదను నాట్యనిగమమందుఁ
జదువనేర్చినభార్య*సాహాయ్యకంబు
చేయనేరని కార్యసంసిద్ధి కలదె.

[1] (అని కౌఁగిలించుకొనఁ బోవును)

‡ వాచ్యార్థము గూఢముగాఁ జెప్పుటచే నిదినాళిక.

† మిథస్తోత్రరూప మగు ప్రపంచము.

[1] రసపారవశ్యమువలని యసంగత కృత్యముచే నసత్ప్రలాపము.

[1] నటి—ఆర్యపుత్ర! యిదిమిగుల సుకుమారురాలు. ఇట్టి నిర్దయాలింగనమును స
హింపదు.

సూత్ర—(సిగ్గుపడి మరలు చున్నాఁడు)

[2] నటి—ఆర్యపుత్ర! నీకు సంతోషముగా నున్నదిగాని యట్టిమహారాజుచరిత మభిన
యింపఁగలమో లేమో యని నాగుండె లదరు చున్నవి.

సూత్ర—ఆఁ. ఇదియేమిమాట. నానాట్యసామగ్రియంతయు సిద్ధముగా నున్నది.
నీవు సంగీతమున నేమి చేసెదవో తెలియదు.

[3] నటి—నేనా! సంగీతసముద్రము నంతయుఁ గల్లోలమయముగాఁ జేసెదను. నీవవ
ధానమును పడవ యెక్కి కూర్చుండుము.

[4] సూత్ర—అవహితుఁడ నైతిని. ఇదిగో ధ్రువ మొదలిడుచున్నాను.

నటి—(నవ్వుతో) ఆర్యపుత్రులా ధ్రువాగానము చేయువారు?

[5] సూత్ర—మాట పూర్తిగా వినకుండఁ దప్పులుపట్టిన నేమి చేయుదును. ధ్రువ
యగు నాట్యవిద్యయని నాయర్థము నీకు ధ్రువాగానముచేయఁ దొందరగా నున్న
ది కాఁబోలును. త్వరగాఁ బ్రారంభించుము. రసపరవశులైన సభ్యులందఱు నొడలె
ఱుంగకపోదురుగాక.

[6] గీ. విన్నవారి నెల్ల వివశులగాఁ జేయు, పాటిలేనిపాట పాటగాదు
రసము లాని యాని రసవశులై విజ్ఞ, వీగకున్న గానవిదులు గారు.

నటి—(ధ్రువాగానము చేయుచున్నది)

క. ధవళితభువనాంతరమై, కువలయమోదంబుఁ గూర్చుకొనఁ జాలినదై
కవగూర్చె నలంకారము, నవవధువగు రాజ్యలక్ష్మి నరనాథులకున్.

సూత్ర—(విని యానందముతో)

[7] గీ. అతివ నీగానసౌకర్య మరసి హాయి, బొంది సభ్యులు జంత్రపుబొమ్మలైరి

---

[1] హాస్యవిషయికవ్యాపారము గలిగినందున వ్యాహారము.
[2] నాట్యప్రస్తావముచేఁ బ్రకృతకార్యసంబంధము చెప్పుటవలన అవలగితము.
[3] అన్యోన్యాధికములగు మాటలాడుటచే నధిబలము.
[4] తొందరమాటలాడుటచే గండము.
[5] చెప్పినమాట నన్యథాసమర్థించుకొనుట యవస్యందితము.
[6] దోషములను గుణముగాఁ జేయుటచే మృదవము.
[7] ఇదియు నసత్ప్రలాపమే.



తనిసి ప్రత్యక్షరగళత్సుధారసమున, స్నాన మొనరింతు మైనింక సరసిజాక్షి

నటి—ఆర్యపుత్ర! యీస్తోత్రములకేమి. తామింకఁ జేయునది చేయుదురుగాక.

సూత్ర—ఇదిగో వాక్శుద్ధికై సర్వవిద్యామూలకందంబగు సరస్వతిని నుతించెదను.

[1] చ. చదువుల కిక్కయై ప్రజలసాకుచు నిచ్చలు సర్వతోముఖా
స్పద మగువృత్తితోడఁ దెలిచాయశరీరముతోడ నీకథల్
త్రిదశులు మెచ్చుచుండఁ దెలిసీవి వసించిన దేవి! సర్వదా
మతిఁ దలపోసెదన్ ననుగుమారుని బ్రోచినరీతిఁ బ్రోవుమా.

(తెరలో) నిక్కము నిక్కము. మావిక్టోరియాదేవి యట్టిదే. నిన్నొక్కని నేకాదు లో
కులనందఱను దనకుమారులనుగాఁ జూచుకొనునది.

సూత్ర—నాసరస్వతీస్తవమును విక్టోరియాస్తవముగా భావించుకొని వైతాళికులు వ
చ్చిరని తోఁచుచున్నది (అని ముందుఁజూచి) * వీరె వైతాళికులు! మనమనంతర
కర్తవ్యమునకై పోదము రా.

(అని నటియు సూత్రధారుఁడును నిష్క్రమింతురు)

(ఇది ప్రస్తావన)

(పిదప సాయణమాయణులను వైతాళికులు ప్రవేశించుచున్నారు)

సాయ—(పరమానందముతో)

ఉ. దీవులలోఁ బ్రసిద్ధిగల దీవిని బుట్టి జగంబు మెచ్చ వి
ద్యావతియై క్రమానుగతిఁ దండ్రిసిరిన్ వహియించి విద్విష
ద్భావరులెల్లరుం బొగడ భూమి నిజంబుగ ధర్మసంఘుసం
భావన నేలు విక్టోరియ భాగ్యము వర్ణనసేయ శక్యమే.

మాయ—సఖా! సత్యముగా నీవనినట్లు విక్టోరియాను వర్ణించుట శక్యమే కాదు.
భూతభవిష్యద్వర్తమానకాలములయం దీమె పరిపాలనమువంటి పరిపాలనముం
గానము.

సీ. మరుదేశములఁ దీయమావితోఁటలు పెంచె నేరాజపుత్రి దయారసంబు
గడియకామడ త్రోవ నడిపింపఁగాఁ జేసె నేహూణదేవి మనోహయంబు
నిమిషాన నఖిల దేశములవార్తలు దెచ్చె నేరాజ్ఞి కుశలధీమారుతంబు
పలుగాళ్ళ తినురీతి ప్రజలకు మాన్పించె నేరామచిత్త కేదారభూమి

---

[1] ఇది కథోద్ఘాతము. ఇదియే గుణవర్ణనరూపమగు ప్రవర్తకము.
"వీరె" యని నిర్దేశించుటచేఁ బ్రయోగాతిశయము.

గీ. వర్ణభేదంబు చూపు సంపచ్ఛలాక్షి, పక్షపాతంబు మాన్పె నేప్రభ్వి మతిభి
పద్వధూమణి యామెకు సాటిగలరె, భూరిసుగుణావలంబ విక్టోరియాంబ.

సాయ—మిత్రమా! వేయుమాటలేల?

ఉ. ఓరి కుమార నీజనకుఁ డుర్వికిఁ బ్రభువయ్యెఁ జుమ్ము ప
ల్మారులు తద్విధంబున నిలాతలనాయకి నన్ను జేయఁగా
నేరవె యన్న నవ్వి జననీ యటులేని నొనర్తు నంచు వి
క్టోరియఁ జేసెఁ బద్మభవుఁడుం జగమేలఁగఁ జేయ నిందిరన్.

మాయ—చెలికాఁడా! యీదేశమున కేమిగాని యీమె ప్రభుత్వమువలన హిందూదేశీయులు పడు సౌఖ్యమింతింత గాదు.

సీ. విడువలేదఁట మానముడుపకుండ మిటారిపడుచుఁగన్నెలు కంటఁబడినపట్ల
నడువలేదఁట నేలఁబడఁద్రోయకుండ దేవాలయంబులఁ ద్రోవ నడుచుపట్లఁ
గుడువలేదఁట బల్మిఁ గొనకుండఁ గడుఁ గష్టపడి పెంచుకొనిన కాపరుల పంటఁ
బొడువలేదఁట ధర్మవుద్దు దాఁటకుండఁ బోటరులౌచుఁ బగర సంగరములందు
గీ. ముడువలేదఁట దస్త్రంపు మూటచేత, లంచమిడకుండ ధర్మపాలనములందుఁ
గటకటా! యెట్లు సహియింపఁ గలిగిరొక్కొ, తురకబిడ్డలబాధ హిందువులు మున్ను.

సాయ—ఔను నీవనినమాట నిజమే.

సీ. ఏనాఁడు దాఁటి రాహిందువు ల్పుట్టిమీఁద నెకాక యేళ్ళవంతెనలమీఁద
నేనాఁడు నాటి రాహిందువు ల్మరుదేశముల సన్నవరి విత్తుమొలకగములు
నేనాఁడు చాటిరాహిందువు ల్తమవారి యేల్బడిమించిన యేలుబడులు
నేనాఁడు మీటిరాహిందువు లొక్కనగోట హూణవిద్యాజయోద్యోగగిరులు
గీ. దూరకాలమునుండి హిందూధరాధిపతులపరిపాలనంబునఁ బ్రాఁతవడిన
భరతఖండంబునకుఁ జక్రవర్తినియయి, నఁ దగు విక్టోరియారాజ్ఞి నాఁడుగాక.

మాయ—మిత్రమా! "చక్రవర్తినియో యనఁదగు" నని యీయుత్ప్రేక్షయేల? నిక్కముగా హిందుదేశచక్రవర్తిని యనిపించుకొనుటకామెకే గదా కొలఁదికాలములో ననేకపృథివీపాలసామ్రాజ్యాభిషేకసలిలధారోపనదీసమావృద్ధంబగు యమునానదిచే నలంకరింపఁబడిన హిందూదేశాలంకారం బగు దిల్లీపురంబున కఖిలసామంతనృపాలురం బిలిపించి కొల్వుకూటంబుఁ గావించెద రఁట.

సాయ—వాణిజ్యమిషంబునం బోయిన సాంఘికులవలనఁ జిరకాలమునుండి హిందువులు పరిపాలించు దేశమంతయు నాక్రమించుకొనిన యిమ్మహాదేవికొక కార్యము సాధ్యమా.



§ చ. అనుపదమేసు దైవము దయామయుఁడై కనుచుండ నెల్లశా
సనములు రాజులెల్ల శిరసావహియించుచు నుండ భాగ్యపుం
గని యగునట్టి యాభరతఖండము నేలెడు రాణి కీమెకుం
జనపతు లెవ్వరీడు సువిశాల దయారసరమ్యవాణికిన్

మాయ—మ. తెలిగొండ న్నగమేన నాలుగుచు నేదేవుండు మున్నుండె న
య్యలఘుండే తెలిసెవిఁ బూర్ణముగ నాలై చూపునందన్నని
ష్ఫలుఖిద్గంబునఁ దాల్చెనో యనుతలంపు ల్గల్గియున్నారులో
కులు విక్టోరియపట్ల నచ్చటను జెక్కు ల్మాటలింకేటికిన్.

సాయ—సఖా! బాగుగ సమర్థించుకొనుచున్నారు. లేకపోయిన స్త్రీవ్యక్తివిశేషమున కిట్టి నిరంకుశాధిపత్యమెట్లు గలుగును.

మాయ—ఔను! పూర్వహిందూరాజుల రాజ్యంబుఁ దలంపించుచున్న యిమ్మహాదేవి సౌరాజ్యంబు నుతింపఁ దరముగాదు. ఏదెసఁ జూచిన నిరర్గళఘంటాపథంబు లేదిక్కునఁ జూచిన నదీకుల్యాప్రవాహంబులు గలిగి సర్వదాసస్యపూర్ణమై భూమి రత్నగర్భానామంబు సార్థకంబు చేసికొనుచున్నది.

ఉ. వానలు లేక భూమి ఫలవంతము గాకొకవేళఁ బండిన
* న్వానలు లేనిదేశములవంకకు నచ్చటిపంట పోక సీ
మానవు లెన్నిపాట్లు పడి గ్రుగ్గిరొ మున్నిపు డొక్కదేశ మెం
దేని ఫలింప నయ్యదియె యెల్లలకేగుచు నుండె నద్దిరే.

అనుమం బ్రిలిపట్టనంబునఁ గొల్వులు దీర్చి విక్టోరియాసౌరాజ్యంబును నుతించుచున్నా రని పెక్కులు వార్తాపత్రికలవలన వినుచుంటిమిగదా!

మాయ—సాయణా! నేనొక రహస్యము వింటిని మనవిక్టోరియామహాదేవి యేండ్లు గడచిన దగుటను బెద్దకుమారుఁడు రాజ్యపాలన సమర్థుండగుటను ధర్మాచరణసభవారం దఱెడ్వర్డునకుఁ బట్టాభిషేక మొనరింపఁ దలంచుకొన్నారఁట. ఇదిసత్యమేనా?

సాయ—మాయణా! తప్పుమాట వింటివి. పెద్దవారుండఁగఁ జిన్నవానికిఁ బట్టముగట్టు నాచారము హిందూరాజులకేగాని హూణరాజులకు లేదు.

మాయ—(మిన్నువంకఁ జూచి) సాయణా? లేనిపోని యితరప్రస్తావనలవలన మనపని

---

§ ఇష్టదైవప్రసాదరూపమగు కథాబీజముపన్యసించుటచే నుపక్షేపము.

* ఇష్టదైవప్రసాదరూపమగు బీజమును విస్తరించుటచేఁ బరికరము.

మఱచిపోవుచుంటిమి. అప్పుడే దేవిగారు ఆమాత్యపురోధఃపరివారసహితముగాఁ గొల్వుకూటంబునకు వచ్చియున్నారు. కావునఁ గైవారము నొనర్చుటకై వేగముగఁ బోవుదమురా.

(అని వైతాళికులు నిష్క్రమించుచున్నారు)

(పిదప యథోక్తముగా విక్టోరియా ప్రవేశించుచున్నది)

పురో—(సంతోషముతో) తల్లీ! దైవమునకు మీయందుఁ గలదయ మెండగుటచే,

గీ అఖిలరాజన్యకులమును నతిశయించి, కీర్తిఁ వహియించె నేఁటి కాంగ్లేయకులము
ఆహిమాచలసేతుపర్యంతభూమి, కైవసముఁ జేసికొంటివ క్కజము గాఁగ.

క. కడిపెఁడుబిడ్డలఁ గంటివి, కడలేని యశంబు మంచి గౌరవము నుర్వీ
నొడయులకు నొడయురాలను, నడువుం గైకొంటి వఖిలనుత్యప్రౌఢిన్.

విక్టో—మహాత్మా! నేఁటిరాత్రి స్వప్నమున నొకయద్భుతము గంటిని.

క. పొడవును లావును గల్గిన, యొడలును గరుణారసంబు నొలికెడి కనులుం
గడు నబ్బిపుఁదేజముగల, యొడయం డగు దివ్యపురుషుఁ డొకఁ డగపడియెన్.

చామరగ్రాహిణి—తల్లీ! దేవమాత కాఁబోలు. నిరంకుశమహిమ గలమీకు దైవప్రత్యక్షమగుట కబ్రము లేదు.

పురో— తరువాతఁ దరువాత?

విక్టో—ఇట్లెదుటఁ బడినఁ బవంపడి యేనును నాస్వప్నమునందే లేచి నమస్కరించి తోడితెచ్చి యొక్కరత్నసింహాసనమునం గూర్చుండఁ బెట్టితిని.

చామ—పెద్దలెదుటఁ బడిన మర్యాదయిచ్చి మర్యాదపొందుటలవాటగు తమకు స్వప్నము నందుఁ గూడ నాయాచార మెట్లుతప్పును.

పురో—ఆంగ్లేయరాజవంశ మనఁగాఁ బెద్దలకు గౌరవమిచ్చునదియు వారివలన గౌరవమును బొందునదియుఁ గదా! తరువాతఁ దరువాత?

విక్టో—తరువాత. గీ. శయ్యయొద్దనున్న చల్లనీరంబుఁ, ద్రావనిచ్చి మంచి సేవకులను
సేవదీర్పఁబనుపు సేసి పణ్యారంబు, లొసఁగియిట్టులంటి నెసక మెసఁగ.

క. దేవర యెవరో? యేపని, కైవచ్చితిరో? యటన్నఁ గడుకొనుదయ కన్
గ్రేవలఁ దొలఁకంగా నా, దైవం బిట్లనియె నభయదం బగుమతితోన్.

వత్సా! ఆంగ్లేయకులప్రదీపమా!

క. తలదాఁటిన భూపుణ్యం, బులవలనను ధారుణీతపోమాహాత్మ్యం
బులవలనఁ బ్రజలసుకృతం, బులచే నీకుర్వియేలుపుణ్యం బబ్బెన్.



క. నీపెద్దకొడుకు ధరకుం, బ్రాపకుఁడై ప్రజలమేలు వడయంగలఁడ
ప్పాపనికి నేలయేల్బడి, లోపలి రుచిఁజూపు మెల్ల లోకులు మెచ్చన్.

పురో—దేవీ! నీమనోరథమునకుం దగినట్లే దివ్యపురుషుండు సెలవిచ్చె. ప్రజలకుఁ గూడ నీమహోత్సవము క్షేమంకరమైయున్నది. కావున నిదియెల్లరకుఁ దేటపఱచి హిందూరాజ్యలక్ష్మి నెడ్వర్డుభూపాలుని భుజాశిఖరమునఁ గూడఁ గొంచె మెక్కింపుము *

చామ—తరువాత?

విక్టో—ఆమాటలు విని హర్షముచే లోచనములు పల్లవింప హిందూరాజ్యలక్ష్మియుఁ గూడఁ బ్రక్కనే నిలువఁబడి యుండెను.

చామ—[1] దేవిహృదయము ననుసరించియుండు హిందూరాజ్యలక్ష్మి కిట్టిహర్షావిర్భావముచితమే.

విక్టో—[2] పిదప నేనును నాంగ్లేయరాజులమే లంతయు నీయధీనమే యని యూఱకుంటిని.

చామ—పిమ్మటఁ బిమ్మట?

విక్టో—తరువాత నద్దివ్యపురురుషుఁ డింకొకమాట సెలవిచ్చెను.

పురో—ఏమని?

విక్టో—తన్ను వరింప నిచ్ఛగించు హిందూరాజ్యలక్ష్మి చక్కఁదనమంతయు నరసి వచ్చుటకై ముందొకసారి నీకుమారు నక్కన్యాసమీపమునకుం బంపుము. దిగ్విజయయాత్రాకుతూహలియై మరలివచ్చిన పిమ్మట నీయభిమతముఁ దీర్చుననియె.

చామ—పురో—[3] కుమారునకు యౌవరాజ్యపట్టాభిషేకము చేయుమనుటచే సంతసంబును దూరదేశమునకుఁ బంపుమనుటచే విచారమును గూడ మామనంబుల దొర్లాడుచున్నయవి.

విక్టో—ఇట్లుపదేశించి యాదివ్యపురుషుఁ డంతర్ధానముం జెందెను.

---

* బీజపరిఖ్యాపనముచేఁ బరిన్యాసము, కథాప్రయోజననిర్ధారణరూపమైనయుక్తి.

[1] మేదినీసుఖాగమరూపమయిన ప్రాప్తి.

[2] దైవోపదేశాంగీకారరూపమగు సమాధానము.

[3] సుఖదుఃఖహేతుభూతమగు విధానము.

మంత్రులు—[1] ఈవృత్తాంతము ధర్మాచరణసంఘమువారికిఁ గూడఁ దెలియఁజేసి వారియనుజ్ఞంగూడఁ బొందవలసినది కదా! అదియునుంగాక హిందూదేశమంతయుఁ దిరిగి ప్రజల మంచిచెడ్డలారసినపిదపనే మన యెడ్వర్డునకుఁ బట్టాభిషేకము చేయుట యుక్తము.

పురో—మంత్రులయాలోచన మిగుల చక్కనిది.

విక్టో—అట్లయిన [2] ధర్మాచరణసభవారి కీవృత్తాంతముం దెలిపి వారియభిప్రాయముఁ గూడ దెలిసికొనుండు. వారీవిషయము విచారించునపుడు.

చ. అవనిభరించి యింపనుకనక్కట భర్తృవిహీననయ్యు మం
త్రివరులు మీరు సాయమొనరింపఁగ నేలితిఁ బెద్దవానికై
దవపదివచ్చె రాజ్యభరమంతయు నాతనికిచ్చి నేను హిం
దువులును వారిదేశము గనుంగొనఁ బోయెద సమ్మతింపరే.

అని కుఱ్ఱవాని ప్రయాణము మాన్పించుటకును నేను భరతఖండమును జూచుటను గుఱించియుఁ జర్చింపుఁ డని చెప్పుఁడు.

మంత్రి—తల్లీ! నీవనిన పల్కులు విచారమునకుఁ దేఁదగినవియే కావు. నీవు హిందూదేశమునకుఁ బోవుటకాని యువరాజునకు మూర్ధాభిషేకము చేయుటకాని నేఁడొనర్పఁ దగినపనులు కావు.

గీ. ఆహిమాచలసేతుపర్యంతభూమి, కైవసముఁ జేసికొంటి వక్కజముగాఁగ
జయము జయమంచుఁ బ్రజలెంచఁ జక్రవర్తి, నీపదముఁ బొందవలయు దానికి నిజంబు.

చిరకాలము హిందూచక్రవర్తులకును బిదపఁ దురుష్కప్రభువులకును రాజధానియగు ఢిల్లీపురంబున నొక్కకొల్వుకూటంబుగావించి యచ్చటికి హిందూదేశాధిపతులనందఱి రావించి వారిసమక్షమున హిందూదేశచక్రవర్తిని యనుబిరుదంబు దేవిగారికిఁ దట్టింపఁ జేయవలయునని యిదివఱకే నిశ్చయించుకొని యుంటిమి. హిందూదేశీయు లందఱును ద్వీపాంతరీయుల ప్రభుత్వము మొదట దుస్సహమని తోఁచకమానదు. ఇట్టిసమయంబున వారిసమక్షంబునకుఁ దమరు పోవుట మంచిది కాదు. అచ్చోటికిం బోయినఁ బ్రమాదము గల్గునేమోయను సంశయ మింతలో విడువరాదు. ఇతరమతస్థు లితరదేశస్థులు తమదేశమును బాలించుచున్నారను దుఃఖము మనముచేసిన యుపకారములనుభవించికాని వదలరు. కావున భవిష్యచ్చక్రవర్తియగు మనయువరాజునే హిందూదేశమునకుఁ బంపుట మంచిది.

---

[1] బీజమును బహువురకుఁ దెలుపుటచే నుద్భేదము.

[2] బీజానుగుణప్రోత్సాహరూపమగు క్షేపము.



చ. తురకలయేల్బడి న్మిగుల దుఃఖముఁ బొందినవారుగాన లోఁ
బఱచిరి రాజ్యము ల్మనకుఁ బాపము హిందువు లట్టివారి నే
ర్పరి తనమొప్పఁ బూర్వసుఖపద్ధతులం దలదాఁటు నట్టు లే
లిరి యనిపించుకొన్నఁ బ్రబలింతుము నాఁటికి నాఁటి కచ్చటన్.

చ. మతముల జోలికేగక సమానముగా జనులందఱి న్సుఖ
స్థితిగనఁజేయుచు న్జమువు దేశముల న్మిగులంగఁజేయ ను
న్నతపదఁజెంది హిందువు లనారతము న్మనయందు భక్తిసం
గతులయి సేవసేయుదురు కార్యములన్నియుఁ జక్కఁ జేయుచున్

కావున యువరాజప్రయాణమునకై ధర్మాచరణసంఘమువారి యనుమతిం బొందుటకుఁ బోయెదము. [1]

(అనిమంత్రులు నిష్క్రమింతురు)

(ఇదిముఖసంధి)

(తెరలో) శా. లోకాలోకగిరీంద్రకందరతమోలోకంబునేకాలముం
బోకార్పం దగు నీప్రతాపమునకే భూమి ల్నివాసంబు లే
లోకంబుల్ తగునాటచోట్లనుచు నాలోకించుచందంబుగా
నాకాశాగ్రముఁ జేరె సూర్యుఁడు సమగ్రాంశుండు విక్టోరియా

ఉ. శారదచంద్రచంద్రికల చందముగల్గు భవద్గుణంబు లిం
పార నుతించుచుంద్రు మలయాచలచందనకుంజమండలో
దారఫణీంద్రకాంతలు తదక్షరగీర్ణసుధారసంబు నిం
డారఁగ గ్రోలి వాయ్వశనజాయశమున్ విదళించుకై వడిన్.

విక్టో—(విని పరివారమువంకఁ జూచి) మీరంద ఱభిమతాచరణమునకై పొండు నేనంతఃపురమునకుఁ బోవుచున్నాను.

(అని యథోచితముగా నందఱును నిష్క్రమింతురు)

ఇది... తిరుపతివేంకటేశ్వర ప్రణీతంబగు నెడ్వర్డుపట్టాభిషేకం బనునాటకంబునఁ గళ్యాణస్వప్నం బను ప్రథమాంకము.

---

[1] ఇది బీజానుగుణారంభరూపమగు కరణము. బీజారంభసంబంధరూపమగు ముఖసంధిసాంగముగాఁ జెప్పఁ బడినది.

శ్రీరస్తు.

# ఎడ్వర్డుపట్టాభిషేకనాటకము.

## ద్వితీయాంకము.

(పిదప వృద్ధకంచుకి ప్రవేశించుచున్నాఁడు)

కంచు—(తెరలో సంతోషముతో) [1] చిరకాలమునుండి పనిచేయుచు ముసలి వాఁడనై యుండియు నేను యువరాజరాజ్యాభిషేకమహోత్సవాలోకనభాగ్యంబునకై బ్రదికియుంటిని.

క. అడుగడుగునందుఁ జేష్టలు, తడఁబడ వాక్కులును గద్గదంపడ నోడలు
వ్వడఁకఁగ నడిచెడు ననుఁగని, యొడయం డెడ్వర్డు నవ్వుచున్నాఁ డెపుడున్.

[2] గీ. దేవి నత్తగ భావించి తివిరి హూణ, రాజ్యసంపదమాయువరాజువంకఁ
జూచుచున్నది కడకంటి చూపులోలయు, మూలవేశ్మంబులోఁ గిటికీలగుండ.

(ప్రవేశించి ముందుఁజూచి) వీఁడె రాజపుత్రపరిచారకుఁడగు దారకుఁడు వచ్చుచున్నాఁడు.

దార—(ప్రవేశించి) ఆర్య! కంచుకీ! నమస్కారము.

కంచు—(కనుబొమ్మలమీఁదఁ జేయివెట్టిచూచి) దారకుఁడా! నాయనా శుభముల నొందుచు వర్ధిలుము మనవిక్టోరియా చక్రవర్తినిగారు యువరాజును హిందూదేశమునకంపుట కంగీకరించిరఁట. ధర్మాచరణసంఘమువారు గూడ సమ్మతించిరా?

దార—నిన్న రాతిరి నిండోలగంబు గావించి యీవిషయమ్ము చర్చించి సభవారందఱు యువరాజు హిందూదేశమునకుఁ బోక తీరదని నిర్ణయించిరి.

కంచు—దేవియే హిందూదేశమునకుఁ బోవుటకై సన్నద్ధకాఁగా యువరాజు తానే యేగుటకుఁ బ్రయత్నించెనఁట కాదా? కావున మనయువరాజున కిది బలవద్గమనము కాదు.

దార—నిజము. కాని, ఆర్యా! అతిసుకుమారుఁడు రాజపుత్రుఁడు హిందూదేశము మిగుల నుష్ణదేశమఁట. యెట్లు తిరిగి రాఁగలుగునో!

---

[2] మధ్యాహ్నవర్ణనముచే విచ్ఛిన్నమగు కథాభాగమును మరలఁ జెప్పుటచే బిందువు.

[3] రాజ్యలక్ష్మికి నెడ్వర్డునంపలి యభిలాష సూచించుటచే విలాసము



కంచు—[1] నాయనా! సందేహింపకుము! గొప్పవారిచరిత్రములు మిగులనద్భుతములు. వారికసాధ్యకార్యము లుండవు. కాక రాజకుమారుఁడు భగవదంశసంభూతుఁడుగాని సామాన్యుఁడు గాఁడు.

దార—అవును. భవితవ్యమెట్లు కాఁగలదో యెవరికిఁ దెలియును.

కంచు—ఇప్పుడు యువరాజుగా రెక్కడ నున్నారు?

దార—మంగళప్రస్థాన మాచరించి మతాచార్యులకు మ్రొక్కి దేవాలయంబులో నిష్టదైవముం బ్రార్థించి సముద్రప్రాంతవినివేశితస్కంధావారుఁడై మంత్రులతో నేమేమో మాటలాడుచు స్వప్రాసాదములో నున్నాఁడఁట. నేన ద్వరగాఁ బోవలయు నాజ్ఞయిమ్ము.

కంచు—పొమ్ము. నేనును రాజకులమునకుం జనియెద.

(అనియిరువురును నిష్క్రమించిరి)

(ఇది చూళిక)

(పిదపమంత్రులతో యువరాజును బరిజనముఁ బ్రవేశించుచున్నారు)

యువ—మంత్రులారా!

ఉ. తల్లి నయంబు మీఱఁగ నుదారగతిం జగమేలు చుండఁగాఁ
బిల్లనిభంగి సౌఖ్యములఁ బెంపువహింపక దోషరాశి పు
ట్టిల్లగు రాజ్యభారము వహింపఁగ నాకిపు డేమి వచ్చె నా
యుల్లము యౌవరాజ్యముసె యొల్లకపోయె మఱింతయేటికిన్.

[2] కావున, విక్టోరియామహారాజ్ఞీభుజపరిఘునిష్కంటకీకృతంబు లగు హిందూదేశదిగంతములందు విజయయాత్రకుతూహలముచే సుఖముగాఁ గాలము గడపెదను.

మంత్రులు—రాజపుత్రా! ఇది హూణరాజకృతాచారము కాకపోయినను ముదుకయగుటచేఁ దల్లిగారు ధురంధరుఁడవగు నీయందుఁ గొంచెము భారముంచవలయు నని తలఁచినదిగాని నేఁడేరాజ్యభారమంతయు నీతలయందుంచుట యామెతలంపుగాదు. స్వప్నమునఁ గూడ నామెకొక దివ్యపురుషుఁ డిట్లే సెలవిచ్చినాఁడఁట. పెద్దలయాజ్ఞ జవదాఁటుట యుచితముగాదు.

---

[1] దృష్టనష్టబీజానుసరణరూప మగు పరిసర్పము. లక్ష్యమగు దిగ్విజయ యాత్రచే నలక్ష్యమగు కథాబీజమును మరలసూచించుటచే నిందుఁ బ్రతిముఖసంధి చెప్పఁబడినది.

[2] రాజ్యమందనిచ్ఛ చెప్పుటచే విధూతము.

యువ—[1] అట్లయిన నవశ్యము తల్లిగారియానతి శిరసావహింతును.

మంత్రులు—ఇట్టి వినయము మీవంశస్థుల కందఱికి సహజగుణమే.

పరిజనము—[2] స్థవిర యగునమ్మగారే రాజ్యభారమును వహించువారు. తానురాజ్యలక్ష్మిని దొడమీఁద నిడుకొని లాలించుచుండఁగఁ జూడవలయు ననియె యామె యుద్దేశము.

యువ—[3] (నవ్వుచుఁ బరిజనము వంకకుఁ జూచుచున్నాఁడు)

పరి—చిరకాలమునకు మేదిని చరితార్థ మైనది.

క. కులగిరుల తలలు మోయుట, వలనం దచ్చిలలు దాఁకి వసివాడిన యీ
యిల కెడ్వర్డుమహీభృ, ల్లలితభుజాశయ్య సుఖవిలాస మొసంగున్.

గీ. మును హరిశ్చంద్రభూపాలముఖ్యరాజ, భుజములం దెల్ల సౌఖ్యము ల్పొందినట్లు
సప్తమైడ్వర్డుభూపభుజంబునందు, రమణవహియించు హైందవరాజ్యలక్ష్మి.

యువ—(బాహుస్ఫురణ మభినయించుచు నధోముఖుఁ డగుచున్నాఁడు.)

మంత్రులు—రాజపుత్ర!

క. వివిధవిచిత్రవితానం, బవు తనశయనాలయంబు నమరించుచు హైం
దవరాజ్యలక్ష్మి నేఁటికి, యువరాజాగమము గోరుచుండెఁ దనంతన్.

పరి—[4] క. యువరాజునకున్ విద్యా, యువతీమణియందుఁ గలిగియుండిన ప్రేమం
బవలోకించుచు లక్ష్మియు, భువియుం దదపేక్షయెట్లుపొందక యుండున్.

మంత్రు—[5] ఎవఁడురా యక్కడ? సేవకులింకను బయలు వెడలరేమి? మేము కేవలము మంత్రపాణులమే గాక శస్త్రపాణులమై కూడ స్వామి నారాధింపఁగలవారమే.

పరి—[6] ఈదేశయాత్ర యేలవచ్చెనో. పట్టాభిషేకమున కాలస్యమగుచున్నది.

దౌవారికుఁడు—(ప్రవేశించి) జయము జయము యువరాజా! సేవకులందఱు సముద్రతీరమున దేవరరాకం బ్రతీక్షించుచున్నారు. సేనాపతులతో సేన యిరుదెసలబారుగట్టి నిలిచియున్నది.

[1] రాజ్యమందలి యనిచ్ఛను మానుటచే శమము.
[2] పరిహాసవచనరూప మగునర్మము.
[3] పరిజనవాక్యజన్యమగు ప్రీతిని జెప్పుటచే నర్మద్యుతి.
[4] మంత్రిపరిచారకుల వాక్యములవలన బీజానురాగము ప్రకటనచేయఁ బడుటచే ప్రగమము.
[5] నిష్ఠురవచనరూప మగువజ్రము.
[6] ప్రకృతకార్యవిలంబనముచే నిరోధము,



యువ—ఇదిగో వచ్చుచున్నాము.

వైతాళికుఁడు—(ప్రవేశించి) జయము జయము భవిష్యన్మహారాజా! యువరాజ!

సీ. సామంతరాజన్యసంఘము ల్గాని తెచ్చి యుసుగర ల్మీకిచ్చుచుండ్రు గాత
ముంబాయినగరముఖ్యముఖ్యపురుల్మీకు నన్ని కన్నులపండు వగుచు గాక
దేహంబునకు సుఖస్థితి యిచ్చి మిమ్ము తదుష్ణంబు బాధింపకుండుఁ గాత
కాఁబోవు మారాజుకరుణామయుఁడటంచుఁ బ్రజల మెప్పులు పొందఁబడుదు గాత

గీ. గద్యపద్యప్రబంధ వాక్కల్పనముల, రేఁగి కవులెల్ల మిమ్ముఁ గీర్తింత్రుగాక
దంబుమీఱంగ భరతఖండంబుఁ జూడఁ, బోయిరావయ్య యెడ్వర్డుభూమిపాల.

దౌవా—(మరలఁ బ్రవేశించి) దేవా? సేనాపతులు దేవరదర్శనమునకై మొగసాల వేచియున్నారు.

యువ—శీఘ్రముగఁ బ్రవేశపెట్టుము.

సేనా—(దౌవారికునితోఁ బ్రవేశించి యథోచితముగా నమస్కరించి) దేవా సర్వతోముఖాటోపముగల మావాహినులు శౌర్యోదన్వంతుఁడ వగు నిన్నుఁ గలయవచ్చినవి, కావున వీరిని నయనాంచలమునం గటాక్షింపుము. [1]

మంత్రి—రాజపుత్రా! వేగఁ దులితాహస్కరరథం బగునీకర్ణీరథ మారోహింపుము.

యువ—(రథమెక్కుట యభినయించుచున్నాఁడు)

మంత్రిలు, పరిజనము—(సంతోషముతో)

[2] గీ. ఉరక నవకరగ్రహోదగ్రతేజంబు, పెంచి దెసలనాక్రమించుసూర్యుఁ
డుదయనగముమీఁద నొప్పెడు గతియువ, రాజు వెలుఁగుచుండె రథముమీఁద.

(అందఱును గూడ నడచుచున్నారు)

మంత్రి—సారథీ! కర్ణీరథము మెల్లమెల్లనఁ దోలుము. రాజపుత్రు లిరుదెసలనుండు సేనాసౌష్ఠవమును విలోకింపఁ గలరు.

సేనా—(కర్ణీరథము నొకచేతఁ బట్టుకొని నడచుచు) మహారాజ్ఞీపుత్రా! యీదెసకు దృష్టిప్రసరింపఁ జేయుము-

చ. కదలినరేఁగి పైకెగయుకాల్బడబంటుల పాదధూళితో
యదములు గాఁగఁ జంచలలయంపము కత్తులు చూప భూమిగ్రు
క్కదలుచు ఫేంకారవము గర్జితరీతి వహింపనేన్గుపె

[1] అనునయవచన రూప మగుపర్యుపాసనము.
[2] ప్రకృతానుగుణవర్ణనముచేఁ బుష్పము.

న్మదములు వృష్టిగా నటఁ గనంబడు సేనలు వానకాలమై.

మఱియు నీవంకకుఁ జూడుము.

క. అడుగు లిడువేళ శేషుఁడు, పడగలు వంచుచును వానిపై కెత్తినయ
ప్పుడు పైకెత్తుచునుండఁగ, నడచుం గజఘటలు చూడ నగములపగిదిన్.

దేవా యీప్రక్క విలోకింపుము, యువరాజహిందూదేశప్రస్థానసంతోషమున నొడ లెఱుంగక యుప్పొంగి నడచిపోవు భటుల యాటోపము.

చ. ప్రతికరమందుఁ గత్తులు తుపాకులు నమ్ములు తోమరమ్ము లు
న్నతగదలుం ముసుంఢులు ధ్వనద్ధనురాదికసాధనంబు లు
న్నతిమెయిఁ దాల్చి రూపము గనంబడు నట్లు చరించు విక్రమా
ద్భుతరసమూర్తులో యనఁగఁ బొల్చుచునున్నవి సేనలచ్చటన్.

మంత్రిలు—అయ్యారే! తురంగతరంగముల చాకచక్యము! అద్దిరే! విదళితపరబల మనోరథంబు లగు రథంబుల సంభ్రమము! వహ్వారే! యేకవర్ణకంకటోష్ణీషధారులై నలికంబులు బుజంబులఁ దాల్చి యడుగులం దడుగు లిడుచు బారులుతప్పక నడచుచున్న పదాతుల నైపుణ్యము!

యువ—(నాలుగుదిక్కులు కలయం జూచి) సైన్యము లన్నియు సమగ్రసాధనంబులై యున్నవి! బృంహమానగజాకీర్ణయు హేషమాణహయాకులయుఁ గ్రీడమాన స్యందనయు నగు నీవాహిని నాకమితానందముం గూర్చుచున్నయది.

సేనా—రాజపుత్ర! హిందూదేశయాత్రాకుతూహలులగు దేవరవారి యనుజ్ఞనీ సేనల న్నియుఁ బరిపాలించుచున్నయవి.

యువ—(అనుగ్రహముతో మంత్రులవంకఁ జూచుచున్నాఁడు)

మంత్రు—(ఉత్సాహముతో) సేనాపతులార! త్వరగ సేనల నన్నింటిని మరలించి స్వస్థానమునకుఁ గొంపొండు.

సేనా—(మంత్రులయానతిప్రకారము చేయుచున్నారము.

యువ—(ముందుఁ జూచి) ఏలాకో యమ్మగారి సేవకుండు పరుగెత్తుకొని వచ్చుచున్నాఁడు!

సేవ—(ప్రవేశించి వినయముతోఁ గుడిచేయెత్తి) రాజపుత్రా! జయము దేవాలయములోని ముఖ్యాచార్యులిచ్చిన యాశీఃప్రసాదములు దేవరకిమ్మని యమ్మగారుపంపించినారు.

యువ—(వినయముతో గ్రహించి)



గీ. అఖిలరాజాధిరాజవంద్యాంఘ్రియైన, తల్లియాశీఃప్రసాదమహాదలధరించి
నట్టికతమున భరతఖండాతిశయము, చూచివేగమ మరలివచ్చుట నిజంబు.

మంత్రి—నిరర్గళపరాక్రమక్రమ సంపన్నుఁడవై యనేకదేశయాత్రలుగావించి వచ్చిన దేవరకు హిందూదేశప్రయాణమన నెంత!

సేవ—యువరాజ! హిందూదేశమందలి వార్తలెల్ల నెప్పటికప్పుడు తెలియఁజేయుచుండుమని యమ్మగారుసెలవిచ్చిరి. ఈమాట మఱవవలదు.

యువ—గురుజనవాక్యము శిరసావహించితిని. అమాత్యులారా సేనాపతులారా నాతోరానివారందఱు నిలువుండు.

అంపఱు—యువరాజుగారికిఁ బ్రయాణము శుభప్రదమగుఁగాక! జయము! జయము!

యువ—§అందఱినొద్దను సెలవు, శీఘ్రముగా హిందూదేశముం జూచి వచ్చెదను.

(అనిసపరివారుఁడై ధూమనౌకాధిరోహణమాచరించుచున్నాఁడు)

(అందఱును నెచటివారచటికిఁబోవుచున్నారు)

(ఇది ప్రతిముఖసంధి)*

గద్య.

ఇది... శ్రీతిరుపతివేంకటేశ్వరప్రణీతంబగు నెడ్వర్డుపట్టాభిషేకనాటకంబున హిందూదేశప్రస్థానమను ద్వితీయాంకము.

---

§ పట్టాభిషేకానుగుణప్రయత్నము చెప్పుటచేఁ బ్రయత్నము.
ప్రయత్నబిందుసంబంధముచే సాంగముగాఁ బ్రతిముఖసంధి చెప్పఁబడినది.

సవరణ.

2.వ పుటలో. "నవరసబంధబంధురము...అనుపద్యములో రెండవచరణము చివర నుండి "బాం, ధవమని పెక్కుచోటుల బుధప్రకరంబు నుతింపనొప్పెనే డవయెడవర్డు భూపవరుఁడొకతయిందిఁక వేయునేటికిన్." అనియు,

5.వ పుటలో. "చదువులకిక్కయై" యనుపద్యములో నాల్గవపాదము మొదలు "మదిఁదలపోసెదన్." అనియు.

6.వ పుటలో. "విడువలేదఁట" అనుపద్యము రెండవపాదములో 'దేవాలయంబులత్రోవనరుగుపట్లు" అనియుఁ జదువవలెను.

శ్రీ రస్తు.

# ఎడ్వర్డుపట్టాభిషేకనాటకము.

## తృతీయాంకము.

(తరువాత [1] నిరువురు సేవకులు ప్రవేశించుచున్నారు)

ప్రథముఁడు—ఏమీ! యెడ్వర్డుభూపాలుని నైపుణ్యము! చూచినంతనె సమస్తహిందూదేశసామంతప్రభువులవలనను విశేషగౌరవము సంపాదించెను.

ద్వితీయుఁడు—[2] ఇష్టదైవప్రసాదము వజ్రకవచమైయుండఁగా రాజపుత్రునకు లోపమేమి?

ఉ. శూరుఁడు రాజమాన్యుఁ డనసూయుఁ డుపాయవిదుండు త్యాగి వి
ద్యారతుఁ డాత్మకార్యపరతత్త్వవిధాయి ధరాభృదన్వయా
చారపరుండు ధీరుఁడు ప్రజాపరిపాలనదక్షుఁడైన వి
క్టోరియ తీఁవఁగల్గిన పటుప్రతిభాచణుఁ డాతఁ డల్పుఁడే.

ప్రథ—(మార్గాయాస మభినయించుచు) ధూమనౌక దిగి యిదిగో లండనుపురంబుఁ బ్రవేశించితిమి. (అనిప్రవేశము నటించుచు) నిరతిశయ వగునీవిక్టోరియాంబ యౌదార్యమును నుతింపఁదరముగాదు. స్వభావరమణీయం బగుప్రతిధ్వనిచే భోగావళీప్రముఖంబు లగుస్తోత్రపాఠంబుల నీవైతాళికులు బిగ్గరగాఁ జదువుచున్నారు.

ద్వితీ—(ఆదరముతోఁ జూచి యచ్చటిజనులంగాంచి గుర్తించినట్లభినయించుచు) సఖా చూడుచూడుము—

[3]ఉ. చేలములం ధరించుట త్యజించి భుజంబులమీఁద నుత్తరీ
యాలును మాని యౌదలలయందును బాగలు లేక హూణభూ
శాలురభంగి కాళ్ళకు హిజారులు మేనులఁగోట్లు నెత్తిటో
పీలు ధరించి వీథులను వీఁగుచునుండిరి వీరు హిందువుల్.

[1] పూర్వాంకమందు సేవకులచే నిర్దేశింపఁబడిన పాత్రముల కిందుఁ బ్రవేశము చెప్పుటచే సంకాస్యము.

[2] ఇష్టదైవప్రసాదరూపమగు బీజమును మరలనాకర్షించుటచే గర్భసంధి మొదలిడఁబడినది.

[3] ప్రస్తుతోపయోగికార్యాచరణముచే నభూతాహరణము.



ప్రథ—బాగుగ నానవాలుపట్టితివి! వీరు కరగ్రాహిన్యాయవాద్యధ్యక్షప్రముఖోద్యోగంబులకుం దగిన పరీక్షలిచ్చుటకును శ్రీవిక్టోరియానుగ్రహము వడయుటకును వచ్చిన హిందూదేశస్థులు, "యథారాజా తథాప్రజా" యనున్యాయమున హూణభూపాలురవేషములే ధరించి తిరుగుచున్నారు.

ద్వితీ—ఇటు చూడుము. ఈపౌరులకు యువరాజహిందూదేశయాత్రావృత్తాంతమును వినుటయందలి సంతోషము. మనమచటినుండి వచ్చినవార మని తెలిసి మనల ననుసరించుచున్నారు. కావునఁ దద్వృత్తాంతము నిఁక వెల్లడిచేయుదము.

ప్రథ—మంచిది. ఓలండనుపురవాసులారా! మిత్రులారా! యువరాజహిందూదేశపరిభ్రమణవృత్తాంతములు సంక్షేపముగా వినుండు.

[1] శా. ఔదార్యాకరుఁ డైనరాజతనయుం డాసేతుశీతాద్రి హిం
దూదేశంబును జూచె భూపతులయస్తోకోపధల్ గాంచె నా
సాదించె న్నిజకీర్తి నద్దెసల వీక్షాసత్సుధాధారలా
పాదించెం బ్రజలందుఁ బుచ్చికొనియెం బద్యప్రబంధంబులన్.

ద్వితీ—[2] నిశ్చయముగా నీదినములలో సర్వదా వృద్ధామాత్యపురోధః ప్రభృతులు బలిసికొలువ విక్టోరియామహాదేవి యువరాజవిజయవార్తనే వినఁగోరుచుండును గావున మన మచ్చటికిఁ బోవుదము.

ప్రథ—నీయాలోచన యుచితమైనదియే.

ద్వితీ—(సంభ్రమముతో) మనమాటలు విని విక్టోరియతో విన్నవించుటకై యెవ్వఁడో యమాత్యపుత్రుఁ డొకఁడభ్యంతరమునకై పరువెత్తుచున్నాఁడు. ఇఁక మొదటనే శుభవార్త మనము వినిపించుట తటస్థింపదు. కావున మనలం బిలువనంపువఱకు నిచ్చటనేయుందము. (అనికూర్చుండి యుందురు)

అమాత్యపుత్రుఁడు—(ప్రవేశించి) [3] ఏమీ నాపుణ్యము! ఇట్టి సంతోషవార్త రాణిగారితో మొదట విన్నవించుటనాకుఁ దటస్థించినది. నేవిన్నవించిన శ్రవణప్రియంకర మగువార్తామృతముచేత నమితానందముఁ బొందఁగలదు. నాకును మిగులఁ బారితోషికము రాఁగలదు. (అనిపరిభ్రమించి) యిదిగో మహారాజ్ఞి మంత్రులతోను దక్కిన పరివారముతోను గూడ విదూషకుని హాస్యవచనములకు సంతో

[1] తత్త్వానుకీర్తనరూపమగు మార్గము.

[2] వితర్కప్రతిపాదనరూపమగు రూపము.

[3] ఉత్కర్షవచనరూప మగునుదాహరణము.

షించుచు నాస్థానమంటపమునందే యున్నది. కాఁబట్టి నేనును సమీపించెదను.

(యథోద్దిష్టముగ విక్టోరియాప్రవేశించుచున్నది)

విక్టో—మంత్రులార! మనచిరంజీవి చిన్నతనమైనను నెంతటియౌచిత్యము కలవాఁడో చూడుఁడు. నాసంరక్షణమునకని కదా సేననంతయు వెంటఁ గొనిపోకయే దేశాంతరమున కేగినాఁడు!

విదూ—నేను మాత్రమౌచిత్యము కలవాఁడను గానా! నిన్నమీరు పాలు పండ్లు లడ్డులు తినుమని పెట్టఁగా నన్నియుఁ దినక మాయమ్మకొఱకుఁ గొన్ని మిగిల్చి కొనిపోలేదా యేమి!

మంత్రి—తల్లీ! యాశ్చర్యమేమి. యువరాజునకు విద్యాబుద్ధులు నేర్పినవారెవరు? తమరు కాదా!

విదూ—నాకుమాత్రమీతిండి నేర్పిన వారెవ్వరు? మాయమ్మగారే కాదా!

పురో—యువరాజు హిందూదేశమున కేగినదిమొదలు సుశకునములగుచునే యున్నవి. కానఁ జిరంజీవి విజయియై వచ్చుటకేమియు సందియములేదు.

పరిజనము—ఆంగ్లేయరాజన్యవంశము చేసిన పుణ్యములలో నేపుణ్యమును దక్కువలేదు.

విక్టో—చిరకాలమైనను జిరంజీవి రాకుండెను. వార్తాహారులనైనఁ బంపకున్నవాఁడు.

మంత్రి—ప్రతిదినమును నుత్తరములును దంత్రీవార్తలును వచ్చుచునే యున్నవిగదా!

విక్టో—అందులకై కాదు. కావ్యము కవిముఖముగా నే వినిన నానందము హెచ్చగును.

విదూ—నాకును రాఁడాయెఁ గదా యనియే యున్నది. అనుదినముం గడుపునిండఁ బణ్యారములు వెట్టుచు వాహ్యాళి గొనిపోవుచు నుండు మాయెడ్వర్డుభూపాలునితో సుఖముగా నుండువాఁడను. ఇపుడు నామొగము చూచువారెవ్వరు. పొట్టకూటికే కఱవైనది.

పరి—సఖా! కుక్షింభర! నీకుఁ దెల్లవాఱిలేచినఁ దిండిమీఁదనే గాని మఱియొక విచారములేదు. నీకు వచ్చిన యీనాలుగుముక్కలు నెట్లు వచ్చినవో తెలియదు.

విదూ—(కోపముతో) మీరందఱుమాత్రము కూటికి దేవులాడక పొట్టనుట్టి వేసికొంటిరా యేమి?

మంత్రి—చాలుఁజాలు వృథావివాదము. యువరాజుగారికిఁ దోడువేషమై తిండి యలవాటుపడినవాఁడు గనుక యితఁడనుకొన్నాఁడు.

విదూ—(విసుగుతో) మీరు గూడ వారియందే కలసితిరా! అట్లయిన నే నిచ్చట నుండను. (అని దిగ్గున లేచి పోవును)



అమాత్యపుత్రుఁడు—[1] (కొలువులోఁ బ్రవేశించి) తల్లీ! యువరాజుగారిచేఁ బంపఁబడినవార్తాహారులిరువురు వీథిలో నిలిచియున్నారు.

అందఱు—(సంతోషపడుదురు)

మంత్రి—ఎవఁడురా? అక్కడ? ఈమంత్రిపుత్రునితోఁ గూడఁబోయి హిందూదేశవార్తాహారుల నిటకు శీఘ్రముగాఁ దోడుకొనిరండు.

విక్టో—(సంతోషముతో) మనకుక్షింభరుని గూడఁ దీసికొనిరండు.

మంత్రిపుత్రుఁడు—చిత్తము. (అని నమస్కరించి సేవకునితోఁ గూడఁ బోయి మరల వార్తాహారవిదూషకులతోఁ గూడఁ బ్రవేశించును)

వార్తా—తల్లీ! జయము జయము! అప్రమేయమహిమ గలిగి పదిమంది మెచ్చుకొనఁదగిన సంతానముచే వృద్ధిపొందుదువుగాక.

విక్టో—(మంత్రులవంకఁ జూచి) తలఁచికొనినతోడనే వచ్చిన మనోరథములవలెనున్న యీయిరువురకును మంత్రిపుత్రునకును విలువగల వస్తువులు పారితోషికముగా నిప్పింపుఁడు

మంత్రులు—[2]ఎవఁడురా యక్కడ! యీచీటి కనకాధ్యక్షునికిచ్చి యిచ్చిన వస్తువులు తెండు.

సేవ—దేవా! చిత్తము (అనినిష్క్రమించి వస్తువులతోఁ బ్రవేశించును)

మంత్రులు—(పుచ్చుకొని ఆమువ్వురకు నిత్తురు)

ముగ్గురు—(నమస్కారముతో గ్రహింతురు)

మంత్రి—భద్రులారా! యువరాజప్రయాణవృత్తాంతము నీసభాసదులకుఁ గర్ణాభరణముగఁ జేయుఁడు.

వార్తా—మహారాజ్ఞి! సభాసదులార! సావధానముగ నాలకింపుఁడు.

ప్రథ—తమయొద్ద సెలవుగొని కుమారమహీపాలుఁడు పొగయోడయెక్కి సముద్రమార్గమున నిరువదియెనిమిది దినములు ప్రయాణముచేసిన పిమ్మట—

గీ. సప్తభూమికసౌధవిస్తారితంబు, ధూమనౌయూపవప్రబంధురదిశంబు
యోజనశ్రావ్యజనరవభ్రాజితంబు, దాఁపునం జూపఁబడియె ముంబాపురంబు.

ద్వితీ—ధూమనౌక ముంబానగరముం జేరుసమయమున—

సీ. వేలకు వేలు జీతాలు గైకొని ధర్మమరయు పురస్థేయవరులతోడఁ

---

[1] చింత్యమానార్థప్రాప్తిరూపమగుక్రమము.
[1] సామదానాచరణరూపమగుసంగ్రహము.

గోట్లకుఁ బడగెత్తుకొని వణిగ్ధర్మంబుఁ బ్రకటించుసంఘవర్తకులతోడఁ
దనచేయురాజశాసనవిధులందు బాసటయగు జనసభాసదులతోడఁ
బలుప్రదేశములవార్తలు లోకులకువ్రాసి ప్రకటించు పత్రికాపతులతోడఁ
గీ. ప్రభువులను జూడఁ దగినసేవకులతోడ, దారిసేదనడచు పదార్థములతోడ
యెదురుగావచ్చెఁ బోగయోడ యొక్కదేవి, తనయుఁ గన్గొనరాజప్రతినిధియటకు.

మంత్రులు—తరువాత?

ప్రథ—తరువాత యువరాజుగారు రాజప్రతినిధిదత్తంబు లగు నర్ఘ్యపాద్యంబులు గ్రహించి క్రమముగా సపరివారమ్ముగ నప్పురమునందలి నౌకాతీర్థమున దిగు నంతటిలో—

పురో—ఏమి జరగెను?

ప్రథ—మఱేమియు నుపద్రవము జరగలేదు.

మ. ధరణీచక్రము దిర్దిరం దిరిగెఁ బాతాళంబు ఘూర్ణిల్లెనం
బరమల్లాడె సముద్రమంతయును నభ్రస్ఫూర్తియై మించె న
ప్పురిలో రాజసుతుండు నేఁడిటకు రాఁబోనుండెఁగాయంచుఁ ద
త్పరులై పేల్చినమేల్ఫిరంగుల యపూర్వస్ఫీతరావంబునన్.

పరి—జెండాలు మొదలగునవి కట్టి పురమంతయుఁ బచ్చనితోరణములచే నలంకరించి వీథులన్నియు సింగారించిరా?

ద్వితీ—నాఁడాయలంకరించుట. యువరాజువచ్చుచున్నాఁడని వినినదిమొదలుకొని రే యలంకరించిరఁట.

ప్రథ—తరువాత! రౌతులచే నధిష్ఠింపఁబడిన తురంగములఁ గట్టిన యొక్కముత్యాల కర్ణీరథమెక్కి యువరాజుగారు రాజవీథింబోవుచుండఁగా—

* సీ. వీఁడఁటే మనరాజ్ఞి విక్టోరియాదేవి కడుపుపండినరాజకౌస్తుభంబు
వీఁడఁటేయతినిష్ఠతోడ నలెగ్జాండ్ర యార్జించుకొన్న పుణ్యములప్రోవు
వీఁడఁటే భారతోర్వికిఁ జక్రవర్తియై మనలఁ బాలించుసామ్రాజ్యమూర్తి
వీఁడఁటే లోకైకవీరులెల్ల నుతింప నగుప్రతాపంబు దిక్కైనవాఁడు
గీ. వీఁడఁటే యెల్లవిద్యలవీడనంగఁ, దగినప్రౌఢతనంబుచే నెగడుజాణ
యనుచు నున్నత సౌధంబులందు నిలిచి, వరుససేసలు చల్లిరి వనజముఖులు.

విక్టో—(సంతోషగద్గదస్వరముతో) తరువాత?

* ఆయాచిహ్నములచే నూహించుటచే ననుమానము.



ప్రథ—తరువాత, మణిమయాలంకారశోభితంబై యిచ్చటిరాజభవనంబునకంటె నందమైన యొక్క దివ్యభవనంబున విడిసి యెడనెడ సందర్శనార్థమువచ్చు సామంతరాజులకు దర్శనమిచ్చుచు వారుదెచ్చిన యుపాయనంబులు గ్రహించుచుఁ గొన్నిదినంబులుండి తత్పురంబునందలి ధర్మస్థానంబు లన్నియుం దిలకించి పరీక్షించెను.

విదూ—నేనుగేవలము నిర్భాగ్యుఁడను. కూడఁబోయినయెడల నారాజులు యువరాజప్రియుఁడ నని నాకుఁ గావలసినంత తిండిపెట్టి తన్పుదురుగదా!

విక్టో—ముంబాపురము తీరును సౌరును మేడలును గొనియాడఁ దగినవేనా?

మంత్రు—కొనియాడఁబడుట కేమితక్కువ! మనము వార్తాపత్రికల వినుచుండుట లేదా?

ద్వితీ—నిక్కముగ హిందూదేశమందచ్చటను నట్టిచక్కనిపట్టనములేదనియే మా నమ్మకము.

సీ. తలమీఁది పొగ భూతలికి జాఱుటెకాని మేడపైభాగంబు చూడఁబడదు
మిఱుమిట్లు గొని యున్నమిసిమిపోవుటెకాని కనులుగోడలఁడాలు గానలేవు
కాళ్ళనొప్పులెగాని కాంచిన చిత్రప్రదేశమ్ములకు మదిఁదృప్తిపడదు
కొనునాసయేకాని ధనముచాలదు ధనదునకైన నచటివస్తువులుకొనఁగ
గీ. దానివర్ణింపఁ దరమె యెవ్వానికైన, నమితవిక్రాయికజనాకులాపణంబు
వార్ధివీచీనురుద్బాలకర్ధియుతము, భాసురాకారకంబు ముంబాపురంబు.

విదూ—అయ్యో నాబుద్ధియెప్పుడును గతజలసేతుబంధనమే చేయుచుండును!

విక్టో—(అత్యాస్థతో) అచటినుండి చిరంజీవి యేగిన స్థలంబులును దద్విశేషంబులుం జెప్పుడు.

ప్రథ—తరువాత నోదేవీ! సపరివారముగఁ గచ్చి బరోడా సవంతవారీ ప్రముఖదేశాధినాథులచే గౌరవింపఁబడి తదుపహారంబులు కైకొనిన పిదప.

మ. లలితాకారులు శూరు లాప్తులు కృపాలంకారు లార్తావనో
జ్జ్వలవిక్రాంతులు సాహసాత్ము లసమస్థైర్యంబుతో రాజపు
త్రులు పాలించెడు భూమికేగెను భవత్పుత్రుండు సోత్సాహదో
ర్బలసంపన్నుఁడు కార్యవాది కరుణాపారీణచారిత్రుఁడై.

మంత్రు—వీరివలన మెప్పువడసి వచ్చుటయే బుద్ధిమత్తకుఁ బ్రబలదృష్టాంతము.

విక్టో—వారంతటివారా?

